ఆంధ్రసాహిత్యపరిషత్ప్రకాశితము. సంఖ్య ౪౪.

శ్రీరస్తు.

# కవిజనోజ్జీవని-సమస్యలు.

కోటి - శ్రీరాయరఘునాథ తొండమాన్ మహీపాలుఁడు.



కాకినాడ.

ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచేఁ బ్రకటితము.

1937.

వెల 0-4-0

# కవిజనోజ్జీవని-సమస్యలు.

సమస్య లనఁగాఁ గవిని బరీక్షించుటకై పెద్ద లిచ్చెడు పద్యాది భాగములు. వీనిని గైపదము లందురు. కవికిఁ గలభాషాపాటవమును గనిపట్టుటకై కవితయందలి యభ్యాసవిశేషములను దెలిసికొనుటకై యొసఁగెడు ప్రశ్నలు. సమస్యలు సంస్కృతమునందును గలవు. తద్ద్వారముననే మన తెనుఁగులోనికిని దిగినవి. సమస్య యిచ్చుట యనునది కవిని బరీక్షించుటలోని కఠినభాగము. చదివిన శాస్త్రాంశముల నడిగిన నిట్టె చెప్పవచ్చును గాని సమస్య లట్టివి కావు. అష్టావధానములో నిది యొకయంగముగా నున్నది. సమస్యలిచ్చుటలో ననేకవిధములు. సాధారణముగాఁ బద్యము నాల్గవచరణము నిచ్చి మొదటి మూఁడుచరణములును సందర్భానుసారముగాఁ బూరింపు మందురు. కడపటిచరణములో నక్షరలోపనమో యర్థవంచనమో-యుండును. కొంద తేదియో యొక వాక్యము నిచ్చి యిది యేవృత్తములో నిముడు నని యడుగుదురు. కొన్ని పదములనిచ్చి వీని నీవృత్తములో నిముడింపు మని యడుగుదురు.

నగరు, వగరు, తొగరు, తగరు ననుమాటల నిచ్చి భారతభాగవతరామాయణార్థముల నిచ్చునట్లుపద్యములు చెప్పుమని రాధామాధవ కవి నడిగినారఁటగదా. స, సే, మి, రా. - అ, ప్ర, శి, ఖ. అను సంస్కృత ప్రశ్నలును సమస్యలలోనే చేరును.

గోలకొండ, మాలముండ, పూలదండ, కొత్తకుండ యని సమస్యయిచ్చినఁ బద్యములో నొకకవి యిమిడించెనఁట గదా? ఇట్టివే సమస్యలు. ఇందుఁ గొన్ని చాలఁ దేలికగాఁ గనఁబడును. పూరించుటకుఁ గూడఁ దేలికయే యగును. కొన్ని చిక్కులుపెట్టునవి కలవు. సమస్యలను బూరించుటకుఁ గవి కుభయభాషలలోనేకాదు పరభాషలలోఁ గూడ ననుభవము కొన్నింటి కవసరమైనట్లు కనఁబడుచున్నది.

" తిలకాయలపులుసు[దావి తనిసిరిబాఁవల్"
" కప్పను గని పాము భీతి గడగడ వడఁకెఁ."
ఇట్టివి చాలఁ దేలికగా నుండును.
" ఏకాదశినాఁడు సప్త మేడేగడియల్."
దీనిపూరణమునకై కొంతయూహా యుక్తియు నవసరము.
" గుం[డాతికిఁ గాళ్లు వచ్చి గునగున నడిచెఁ."

దీనిని బూరించుటయే [ప్రధాన మైనది గాని-కోదండ[రాముఁడు, "ఇంద్రా[ప్రాసము" "ఈం[డ" యాతఁడు సమస్య యిచ్చె ననుట యంత సరసముగాదు.

మొత్తముమీఁదఁ గవులను బరీక్షించుటకే సమస్యలు పుట్టిన వనుకొనవచ్చును. సమస్యాపూరణము వలన సాహిత్యబలము వృద్ధియగును. కొందఱకుఁ జదరంగపు వెఱ్ఱివలెనే సమస్యలవెఱ్ఱి యెక్కువ. ఒక్క యష్టావధాని గాంచిరా, యొక్కకవి తారసిల్లెనా, చాలఁజిక్కులసమస్య లిచ్చెదరు.

"ఇఁక నొకలక్ష యిచ్చెదను నిందుకుఁ బద్యము చెప్పు సత్కవీ" యని సమస్యయిచ్చిన- " ఇఁక నొకలక్ష యిచ్చినను నిందుకుఁ బద్యము లేదు సత్ప్రభూ" అని చెప్పినట్లు వింటిమి.

" సంస్కృతవాసనామహిమ చాలదుగా భువి నెంతవానికిన్ " అని యెవ్వరో -మాదుగులసంస్థానములోఁ గాఁబోలు- సమస్య యిచ్చినట్లును అల్లమరాజు సుబ్రహ్మణ్యకవిగారుకాఁబోలును రెండుచరణములు పూరించినట్లును వినియుంటిని. విషయమును దెల్పుటకే కాని దీనిని యథార్థవిషయముగా నన్నింటిలో నెంచుటకుఁ గాదు. అతివిస్తారము వలదు.

ఈసమస్యల పుస్తకమును తిరిచినాపల్లిజిల్లా, నవసాలపురమను పుదుకోట (క్రొత్తకోట) రాజైన రఘునాథభూపాలుఁడు రచియించెను. పదుకోట స్వతంత్రసంస్థానము. ఈరాజవంశమునకు, తొండమాను లను

బిరుదనామము గలదు. ఈరఘునాథతొండమాన్‌భూపాలుఁడు 1767వ సం. మొదలు 1789 వ సం. వఱకుఁ బరిపాలించెను. ఈతనియొద్దఁ బెద్ద విద్వాంసుఁడు నుదురుపాటి వేంకనార్యుఁడని యొకఁడు కలఁడు. ఈరాజు తండ్రి విజయరఘునాథతొండమాన్ మహీపాలునియొద్ద నీవిద్వాంసుని తండ్రి యుద్దండకవి బిరుదుగల సీతారామశాస్త్రి యుండెను. ఈవెంకన కవికుమారులు సాంబకవి మున్నగువారుండిరి. వీరందఱును ననేకగ్రంథ ములను రచించిరి. ఈసమస్యలను వెంకనకవి యిచ్చుచుండిన రఘునాథ భూపాలుఁడు పూరించినట్లు పుస్తకములోఁ జెప్పఁబడినది. ఈరాజు మున్ను పార్వతీపరిణయమను ప్రబంధమునుగూడ రచియించియున్నాఁడు. దాని లోఁ దన యాస్థానమునందలి విద్వాంసుఁడగు వెంకన్నకవిని బ్రశంసించి యున్నాఁడు. దానింబట్టి కొందఱు వెంకనకవియే రచియించి పార్వతీ పరిణయమునకు రాజుపేరు పెట్టినాఁ డందురు. అట్లే దీనినిగూడ భావించె దరు. మనలో నున్నదియే, కృష్ణదేవరాయలు నే నాముక్తమాల్యదను రచించితి నని యెన్నోసాక్ష్యములతోఁ జెప్పుచున్నను మనవారు దానిని బాటింపక పెద్దనార్యుఁడు రచించినాఁ డని చెప్పెదరు. ఇంకఁ దక్కినవారి మాటేమందుము. కల్పనలలో, నందునను నిస్సారకల్పనలలో, వానిని నమ్ము టలో మనవా రందె వేసిన చేతులుగదా! సుప్రసిద్ధులు విద్వదగ్రణులు వేదము వేంకటరాయశాస్త్రులవంటివారు, ఆముక్తమాల్యదను శ్రీకృష్ణ రాయలు రచించిన దని యొప్పుకొనక పెద్దనపేరు లోకులు చెప్పుచున్నను దానిం బాటింపక, చివరకుఁ బుస్తకముమీఁదఁ దమ పేరైన వేసికొన్నారు గాని రాయలపేరు గాని పెద్దనార్యునిపేరు గాని వేయఁ జేయాడినవారు కారైరి. ఇంక నితరుల లెక్కయేమి. మల్లినాథసూరి యెంత కొట్టుకొనుచు న్నను బెద్దిభట్టుగారని మనవారు వాడుటమానరుగదా? పండితబృందము సభలో నుండఁగా రాజు రసికుఁడు కారాదా, కాఁడా? రాజు లంతయజ్ఞా నులా! భోజరాజుమాట యేమిచెప్పెదరో వీరు. ఇంక విస్తరింపరాదు. పండి తుఁడగు నుదురుపాటి వెంకన్నకవి కవిత్వమునకును ఈరాజుకవిత్వమునకు

నుభేదమున్నట్లు విమర్శకులుఁ, బండితులు, నిదివఱకొప్పుకొన్నారు. ఏవి వెంకన్న వంటివారుఁ బ్రయోగింపఁడని రఘునాథరాజు నెత్తిని రుద్దినారో యట్టివియే యీసమస్యలలోఁ గూడఁ గలవుగావున దీనిని వెంకన్న కవి కంటఁ గట్టరని తలఁచెదను. ఆర్యులారా! నానుడులను నమ్మక నానుడులను విశ్వసింపుఁడు. ఇటీవలి మృత్యుంజయ కవివంటివారు ధనాశచేఁ బలువుర పేర బహు గ్రంథములు రచించినట్లు కనఁబడుచున్న దిగాని- ఆంధ్ర భాషార్ణవము వంటి శ్రేష్ఠతరాంధ్రనిఘంటువును రచియించి యాంధ్రులకు భిక్షపెట్టినవిద్వాంసుఁడు డబ్బుకక్కుఱితిని హీనకార్యమును జేయఁడు. భోజమహారాజు మొదలిప్పటి చిన్నచిన్న ప్రభువులవఱకును వారివారియాస్థానములలో ననేకులు కవులుఁ బండితులు నిల్చియున్నారు. అరసికులయినరాజులు కవుల నాదరింతురా!

ఏవయిన దోషపదములు (వరించేవేళ, దివ్యరత్నాకలితంబగు ద్యుతివిధంబున) కలిగిన నవి యప్పటికి గ్రామ్యకక్ష్యలోఁ జేర్పనివారుకొందఱుండియుందురని తలంచుట లెస్స. కవులు సమ్మతించి రనవచ్చును. అంతియకాని రాజులుచెప్పినవి తప్పులు వారికవులుచెప్పినవి యొప్పులు ననుట సమంజసము గాదు. ఏవియోకొన్ని పదములు విరుద్ధములు దొరలినను- వానిని రాజు కవికిఁ జూపించిన సమర్థించి సందర్భశుద్ధిగా నున్నందుననో దిద్దిన నచ్చుట సరిగాఁ గుదుర దనియో ప్రభువుచు దప్పులు పట్టుటకు శంకించియో యట్టివానిని సమ్మతించినంతన యేమాయె. మఱియు నొక్కరు రచించిన తప్పుల పుస్తకమును విద్వాంసుఁడు దిద్దిన నది యతనిశైలికే వచ్చును. భేద మెట్లు తెలియును. ఇప్పు డిట్టివెన్ని వెలువడుటలేదు! శాంతము పాపము!

ఈకవిజనోజ్జవని పరిషత్పుస్తకభాండాగారములో 3852వ సంఖ్యను గలదు. ఈకాగితముపుస్తకము పరిషత్తునకు దక్షిణదేశమునఁ బుస్తకసంపాదన మొనర్చిన బ్ర. హరి సీతురామయ్యగారు సంపాదించినది. ఇదివారి

తిరిచినాపల్లిలో నున్నారు. ఇందలివివరణములలోని కొన్నిమాటలు మేము సవరణ చేసితిమి. కొన్ని యిప్పటివారికి రుచింప వని తొలఁగించితిమి. ౧౦౪ పద్యములకు ౮౫ మాత్రమే ప్రకటించితిమి. తొలఁగింపఁ బడినవి యభిలాషగలవారు మూలగ్రంథములోఁ జూడవచ్చును.

లికుచంబులు కొండలంత లేదా వాడా.

రాళ్లు తనుదాన గూసెకు రాజవదన.

మగవానికి వైరి యాఁడవాఁడే తలఁపఁగ.

ధారుణి పొడవయ్యె గిరులు తలక్రిందయ్యెఁగ.

అగ్నికిఁ గాళ్ల యిదుగాక యధికముగలదే.

ఇట్టివి పూరణములోఁ జమత్కృతి లేనివి, యసభ్యముగా నుండు నేమో యనుకొన్నవి తొలఁగింపఁ బడినవి. "పగటఁ జంద్రిక" యను 48వ సమస్యకు రెండుపద్యములున్నవి. మొకటిపద్యముం దొలఁగించితిమి. ఇప్పటికిని గొన్నిపూరణములు శ్లేషలమూలమునఁ జక్కగాఁ గుదురుట లేదు. వంకాయ, వంకాయె, బీర(ఱ)కాయ-జాబీరకాయ యను నిట్టివి చూడుఁడు.

ఇది నిజముగాఁ గవిజనోజ్జీవనియే. 73వ పద్యము ద్విప్రాసయుతము. 75వది-గ్రోగ్రణిరో అగ్రణీరవాగ్రణి.-ఇట్టివి పండితుఁడు కానివాఁడు పూరించినవి కావు. పాండిత్యము లేనివాఁడు పార్వతీపరిణయమును రచింపఁ గలఁడా. అందెంత లోకానుభవవిషయమున్నదో చిత్తగింపరా! అక్షరగోపన వృత్తగోపన సమస్యలు, సాధారణములా! అవి సాధారణులకు సాధ్యములా! మాపరాకునన్ కావచ్చును-గ్రంథముచివర కాగితములో నొక్క ప్రక్కను "౨౮ (a) నాలుగేళ్లను నెనిమిదే నలినసయన-

తే. గీ. పరునొక్కటికిని నాలుగెద్దులుండ
నిరుడు కొలుచుండె గాదెలఁ దఱచుగాను
అల్లయెద్దులలో సగ మమ్మివేయ
నాలుగేళ్లను నెనిమిదే నలినసయన."

అనునొక్కపద్యముగలదు. మొదట విడువఁబడినది. మూలములోఁ జేరలేదు. అర్థమేమని జేర్చుకొనుఁడు. అంగళ్లలో దొరకుసమస్యల పుస్తకములందు నిండ నేకవిధముల విశేషములతోఁ గూడిన పద్యములుగలవు. చదువరులకు నేను దెలుపనక్కఱయుండదు.

కవనమునం దాదరముగలపాఠకులార ! సమస్యలనాదరింపుఁడు; సమస్యాపూరణమునందును సమస్యల నిచ్చుటయందును నిపుణుల రగుఁడు. పెక్కులు సమస్యలం జదివినఁగాని మీకు దానియందుత్సాహము కలుగదు, కలిగినంగాని చమత్కారముగ సమస్యల నీయఁజాలరు, పూరింపఁజాలరు. సమస్యాదరణము-భాషాభివృద్ధికి మూలమగును.

పుదుకోట, దానిప్రభువులను, వారివిద్వాంసులను, వారివారి గ్రంథములం దెలుపుచు విరివిగాఁ బఱమత్తువారు చక్కని చరిత్రము వ్రాయింపనున్నారు. కావున నీచిన్నిపొత్తము పీఠికలో విశేషింపలేదు.

విద్వద్విధేయుఁడు,
క్రొత్తపల్లి సూర్యరావు.

శ్రీమద్బృహదంబికాయైనమః.

# —: కవిజనోజ్జీవని. :—

— సమస్యలు. —

ఉ. శ్రీకరలీలఁ బుష్పమునఁ జెందిన తావియుఁ బోలె దివ్యర
త్నాకలితంబగున్ ద్యుతివిధంబున జాబిలి చల్వరీతిగా
నాకపిలాగ్రసుతీశ్వరుని యంగమున న్వసియించి సర్వవి
ద్యాకృతి యై చెలంగు బృహదంబను గొల్తు నభీష్టసిద్ధికిన్.

వ. అని యిష్టదేవతాప్రార్థనంబు చేసి,

క. విజయరఘునాథభూపతి
నుజుఁ డఖిలక్షోణిపాలనుతుఁ డనుచుఁ గవి
వ్రజ మనఁగను మను కవితా
రజనిసుధాస్పృతిని రాయరఘునాథపతిన్.

గీ. సోకనక్షిప్రుఁ డుద్దండబిరుదశాలి
మమ్ముఁ గొలిచియుఁ గఠినసమస్య లొసఁగ
నొప్పుకొని మేము పద్యముల్ సెప్పినంత
నందఱును విని కృతి కివి యర్హ మనిరి.

గీ. కవిజనోజ్జీవని యటంచుఁ గావ్య మొకటి
దుర్ఘటసమస్యలకు నెల్లఁ ద్రోవదెలియఁ
గవిజనంబులకును నుపకారముగను
జేతు దయచేతఁ బృహదంబ చిత్తగింపు.

—: సమస్యలు, తత్పూరణములు :—

(1) "కలుషగిరిభేదశంబ శ్రీబృహదంబా"

ఇది యక్షరవంచనసమస్య- పూరణము.

క. వకుళవననిత్యవాసిని
సకలాభీష్టముల నిచ్చు చక్కనితల్లీ

ప్రకటితము సేయు మీ కృతి
సృకలుమగిరిభేదశంబ శ్రీబృహదంబా.

ఈక్రిందివి శబ్దచిత్రసమస్యలు.

(2) "క్రకచము జలధరముతోఁ గను నింపెసఁగెన్."

క. మకరాంక కేళికోద్రే
కకరత్వాం బెంచి చూడఁగాఁ బలికెఁ జక
చ్చకితను చెలిచయమునకు వ
క్రకచము జలధరముతోఁ గను నింపెసఁగెన్.

(3) "కావేరీ శిరముపైని గట్టఁగవలయున్."

క. నీవంటి సాహసవంతున
కేవేళను జీటిసటిగనమే కాకను పెం
గావి మొదలైనపాగలు
కావేరీ శిరముపైని గట్టఁగవలయున్.

కా=కాదు, వేరే, [illegible] ఏమి— అని పదవిభాగము.

వేఱుపూరణము.

క. స్త్రీవశ్యమునకు సిద్ధం
బౌవేరు నొసంగ దాని నెఱుఁగుము వే కా
యావని కామిని వలచుట
కావేరే శిరముపైని గట్టఁగవలయున్.

వలచుటకు— ఆవేరే, అల్లవేరే— అని పదవిభాగము.

(4) "వాతెఱ లే కొక్క వనిత వర్షంబుండెన్."

క. సీతాంగన యొక్కతయే
వాటికి నెరలేక యొక్క వర్షంబుండెన్
ఆ తెఱఁగున మఱి యేతఱి
వాతెఱలే కొక్క వనిత వర్షంబుండెన్.

వాటికిన్+ఎరలేక; వాతెఱ=మోవి.

(5) "వావిలి లోఁ ద్రోయఁ గ్రోఁతివలెనే యుండెన్."

క. ఓవిద్వజ్జని నను సు
గ్రీవునియన్నకును బే రెఱింగింపుము సూ
పేవిత మనియెను మధ్యము
వావిలిలోఁ ద్రోయఁ గ్రోఁతివలెనే యుండెన్.

వావిలి యనుపదమున- మధ్యమాక్షరమును, ద్రోయన్- వాలి యని యాయెను.

—: వివిధసమస్యలు :—

(6) "పాగా గొంతుకడ శిరముపైనిం గలదే."

క. బాగుగఁ దంబుఱ మీటుచు
రాగంబుల వినికిసేయు రమణికిఁ దలఁపన్
ధాగరి ధగారి ధగరిగ
పాగా గొంతుకడ శిరముపైనిం గలదే.

పాగా=పంచమగాంధారస్వరములు, గొంతుకడ=కంఠమందే కలుగు నని కాని పాగా యన శిరమునఁ దలపాగ కాదు.

(7) "కంబాలకుఁ జనులు గిరులకైవడి నెంచెన్."

క. శంబరవిరోధిమూర్తియె
యాబుజసంభవునిసృష్టి నందనగతి దే
హంబునకు మించుమను జో
కం బాలకుఁ జనులు గిరులకైవడి నెంచెన్.

జోకన్ + బాలకు, అని పదవిభాగము.

(8) "పడుచున్నను బెండ్లిసేయువాఁడును గలఁడే."

క. కడువేడుకగా నుండెడు
పడుచున్నను బెండ్లిసేయవచ్చును జగతిం
దడ లేక పండ్లుఁ జన్నులుఁ
బడుచున్నను బెండ్లిసేయువాఁడును గలఁడే.

(9) "ముక్కున నలమూనవ్రుండు భూరి యొసంగెన్."

క. కక్కసమౌ పదియవమౌ
లక్కట యనుమాడఁ దరుణి యాత్మజు గడలోఁ
జక్కఁగఁ గనఁగాఁ గని యొక
ముక్కున నలమూనవ్రుండు భూరి యొసంగెన్.

"కనెనొక ముక్కున" అనియుండవచ్చు ననితోఁచెడిని (ముక్కు=తినుటవంటిది.) ముక్కుట మూల్గుట- భూరి=పుత్రోత్సవసందర్భమున సువర్ణాదిదానము.

(10) "వంకాయాపెసరకాయె వల్లాజోన్నల్"

క. వంకాయ లమ్ముదానిని
జెంకను బెట్టుసి సరకుఁ జేకొనెఁ జోరుం
డింకేమి చెప్ప మారుఁడ
వంకా యాపె సరకాయె, వల్లాజోన్నల్.

ఉత్తరప్రత్యుత్తరవిషయ సమస్య - వంకాయ, పెసరకాయ, వల్ల, ఆజోన్నల్ వంకాయలమ్మెదాని సరకుగానాయెను, విషయపరిహారము.

(11) "నీవేచేసితివి గాక నేచేసితివే."

క. ఏవేళఁ దప్పవెట్టెద
వోవనితా దేవపూజ కుంచక మునుపే
కావలసిన భక్ష్యంబులు
నీవేచేసి తిని కాక నే చేసితివే.

నీవేచేసి=నీవేపాకము చేసి, తిని=దేవతానైవేద్యముకుఁ బూర్వమే భక్షించి. కాక నేచేసితివే=పూజానర్హముగాఁ జేసితివిగదా:—అని, వక్రముగా- నీవే చేసితివి, నేచేసితివి అని క్రియలం బ్రయోగించినందులకు విషయపరిహారము.

(12) "భంగి నీళ్లను ద్రాగినఁ బ్రజ్ఞ చెడదు"

గీ. భంగినీళ్లను ద్రాగినఁ బ్రజ్ఞ చెడక
పోవ దెటువంటి వారికి భూమిలోన
లలన యేమందుఁ జిత్ర మాకలశమునికి
భంగి నీళ్లను ద్రాగినఁ బ్రజ్ఞ చెడదు.

భంగము=అల, భంగములుగలది భంగి=సముద్రము. భంగి=గంజాయి, కలశ

(13) "చండాళులఁ జేరు తమ్మి సరి యనఁ దగునే"

క. అండజగామిని శ్రీముఖ
మండలమునకు ద్విజరాజు మాత్రమె కా యు
ట్లుండఁగఁ దద్వైరము గొని
చండాళులఁ జేరు తమ్మి సరియనఁ దగునే.

చండాళులన్=మాతంగజాతిని, చేరు=ఆశ్రయించిన, తమ్మి=పద్మినీజాతిస్త్రీ. చండ + అళులన్=కోపములగు తుమ్మెదలను, చేరు, తమ్మి=పద్మము. చండాలసంపర్కముగల పద్మినీజాతిస్త్రీని స్వచ్ఛమైన దనవచ్చునా. చండములగు తుమ్మెదలతోఁగూడిన పద్మము-అండజగామిని ముఖమునకు సరివచ్చునా.

(14) "పోఁగులు చెవులకడ లేక భుజమున వెలసెన్"

క. పోఁగులు కావలె నంచని
యేఁగతిఁ దండ్రికడఁ జెప్ప నీయమని విప్ర
త్యాగతి బాఁపనపిల్లకుఁ
బోఁగులు చెవులకడ లేక భుజమున వెలసెన్.

పోఁగులు=కర్ణాభరణములు. పోఁగులు=నూలిప్రోఁగులు- యజ్ఞోపవీతములు. ప్రోఁగులు చెవులకడలేవు భుజమున నున్నవి యని విషయము- నూలిప్రోఁగులు, అనఁగా జన్నిదములు భుజమునై నున్నవని విషమపరిహారము.

(15) "తరుణి నీకంట సుందరదాసుగుంట"

గీ. పుష్పశిఖి నీవు కావేని ముట్టరాదు
ఇగసన స్నానమును జేయ నింపుగాదు
నాఁడె బహుయత్నమునఁ ద్రవ్వినాఁడు గావె
తరుణి నీ కంట సుందరదాసు గుంట.

నీకంటన్, నీకంటియందు- ఇదివిషయము. నీవు, అంటన్=నీవుస్పృశించుట కర్హమైన సుందరదాసుగుంట- సుందరదాసు త్రవ్వించినకొలను, కలదుగదా యని పరిహారము.

(16) "పల్లములోఁ రాతు రాతుపైఁ బల్లంబున్"

క. పెల్లుగ మీఁటిరి యశ్వా

పచ్చికయు మేసి తపుడును బాగుగఁ దిఁన
జేఁప చన్నులలోఁ బాలు చెంబెఁ డుండె.

చేఁపచన్నులు= మత్స్యస్తనములు= విరోధము. చేఁపన్= పాలుచేఁపఁగా, చన్నులన్=చనుకట్లలో- పాలు చెంబెఁడు గలవు- పరిహారము.

(21) "కమలాననచంటిమీఁదఁ గాఁకర మొలచెన్"

క. రమణుం డూరికిఁ బోయెను
రమణీ యనఁ జనుల సరము రాచినతోడన్
భ్రమఁజెందె ననఁగఁ బులకలు
కమలాననచంటిమీఁదఁ గాఁకర మొలచెన్.

కాఁకర్= కాకరకాఁయ. కాక + అఱన్= విరహతాపమునఁ గుసల్లు.

(22) "వావిరికడఁద్రోచి తెలిసి వారికిఁ బలికెన్"

క. దైవాత్సృకాస్య యొకతే
యీవని సీతకసి యనుచుఁ గృష్ణుని చెల్లెన్
భావముగ నడుగ నదియున్
వావిరికడఁద్రోసి తెలిపి వారికిఁ బలికెన్.

వావిరి కడన్ త్రోసి,= అన్వయము. వావిరిన్= వావిరియనుశబ్దములోని, కడన్= చివరియక్షరమును, త్రోసి=పీసివైచి, "వావి" అనుచు. వావిం దెలిసి పలికె ననిభావము.

(23) "ఖానుఁడు వేఁచేసి రాఁగఁ గంటివె చెలియా"

క. ఆనాఁడు యవనకన్యక
మానము చేకొన్న వాఁడు మాన్యుఁడు త్రిజగ
త్త్రాణుఁడు ధీరుఁడు నిర్జిత
ఖానుఁడు వేంచేసి రాఁగఁ గంటివె చెలియా.

నిర్జితఖానుఁడు= తురుష్కుని జయించిన రంగనాయకుఁడు. రంగేశుఁడు తురుష్కుని జయించి తురకవాచ్చాయను గాంధర్వమున వరించెనని పురాణప్రసిద్ధము.

(24) "మణి కరఁగును గానచంద్రమసులచు దక్కన్"

క. మణి కరఁగు గీతిచే విధు
ఘృణిచే లోకమున రసికుఁ డింతిచను మొనల్
పుణుకుటయె చాలుఁ జూకి ర

(29) "వంకాయను జెఱకురసము వడియుచునుండెన్."

క. పంకజముఖపై నామక
రాంకున కేనుఁట్టికిరుకొ యాశుగముల ని
శ్శంకముగఁ జేఁద నప్పుడు
వంకాయను జెఱకు రసము వడియుచు నుండెన్.

. వంకాయను, వంక + ఆయెను. వంకరగాఁబోయెను. ఇక్షుధనుస్సు గనుక- ఆచెఱకున రసమువడిసెను. పద్యములో వంకాయెను, అనియున్నది. వంక + ఆయెను- అనునది సరియే కాని వంకాయ- అనివంగకాయకురూపముశోధనీయము. వ్యవహారములోనిధ్వనిని బట్టిరేమో.

(30) "కలికిని గనుఁగొంటి డేగకాల నింటన్."

క. పొలమున నారణపక్షిన్
బలిమిని దాప యని తూఱి బహువేగమునం
దలపట్టి యీడ్చునప్పుడు
కలికిని కనుఁగొంటి డేగకాల న్నింటన్.

కలికిన్=స్త్రీని. మింటనంటిని- విషయము. నారణపక్షికలికిన్=నారాయణపక్షి శిరమునందుండు, (తురాయి) యీఁకను. డేగ పట్టి యీడ్వఁగా దానికాలిని బట్టె ననికలికితురాయి.

(31) "రతిపతి మన్మథుఁడు గాఁడు బ్రహ్మాయె తలఁపన్."

క. సతతము వీణావాదన
చతురతఁ దన రత్నసభను జలరూపం బౌ
వితమునను జేయు నాభా
రతిపతి మన్మథుఁడు గాఁడు బ్రహ్మాయె తలఁపన్.

(32) "బీరకాయకన్ను చేరెఁడంత."

గీ. వినను గనను లేదు విశ్వంబులో వింత
గంటి నేను జాలఁ గన్నులార
నీవుఁ జూడరమ్ము నిక్కంబు కనకజం
బీరకాయ కన్ను చేరెఁడంత.

కనక, జంబీర, కాయ=బంగారు, నిమ్మపండువంటి, శరీరము, గల స్త్రీ యొక్క, కన్ను=నేత్రము- చేరెఁడంత.

(33) "రతనమునకుఁ గుఱుతు దంతిరథఘోటకముల్."

క. సతతము సరసామాత్యుల
మతివిభవము గూడ శాస్త్రవర్ణన మెపుడుం
గుతుకమ్మునఁ జేయు నలదో
రతనమునకు గుఱుతు దంతి రథ ఘోటకముల్.

(34) "అమ్మనమ్మను నవల సయ్యాట గలదె."

గీ. నిమ్మపం డ్లమ్ముచును నొక్క వెలఁత రాఁగ
గొప్పవిగ రెండుపండ్లు గైకొందు ననఁగ
నేల పలుమాట లాడెద విటుల విటుల
కమ్మనమ్మను నవల సయ్యాటగలదె.

అమ్మను=నిమ్మపండ్లు విక్రయింపను, అమ్మను=తల్లి. పండ్లమ్మెడిది పిత్రుటనను గుటమేల. అమ్మను- అని వాఁడు తెల్పినప్పుడు విటులసయ్యాటము లుండునా.

(35) "బోడికిఁ గొప్పాంచ మిగుల ముద్దులు గులికెన్."

క. [illegible]డను వినికియుఁ గలదే
బోడికిఁ గొప్పాను పలుకు భువనస్థలిలోఁ
గోడెమిటాకి నాపూఁ
బోఁడికిఁ గొప్పాంచ మిగుల ముద్దులు గులికెన్.

పూఁబోడికిన్=పుష్పసదృశశరీరముగల స్త్రీకి.

(36) "పలుకులనే చెప్పకతనఁ బలుకులె యయ్యెన్."

క. పులకండము లంచని తే
నెలటం చని పలుకుముస్త్ర నేరనివారల్
కలికికిఁ బలుకులు కపురపుఁ
బలుకులనే చెప్పకతనఁ బలుకులె యయ్యెన్.

(37) "గ్రామమ్మున కొసఁగె శివుఁడు కంజాక్షునకున్."

క. తామరలు నాలు పూజకు
నేమంబున నొకటి దఱుగ నేత్రం బిడినం
బ్రేమం జక్రమ్మును సం
గ్రామమ్మున కొసఁగె శివుఁడు కంజాక్షునకున్.

గ్రామము- విషయము, సంగ్రామము=యుద్ధము- సమాధానము.

(38) "తెలిమఱుఁగే చాలు వేఱ తెరమఱుఁగేలా."

క. తెలివా నీయధరమునే
నిరతము నాశించి యుండ నీవును జేత
మఱుఁగిడి తదిసరియా వా
తెలిమఱుఁగే చాలు వేఱ తెరమఱుఁగేలా.

తెర=మఱుఁగుచీర. వాతెలి=మోవి.

(39) "రంగపతే తురక గాక రంగప తౌనా."

క. అంగనఁ గొని వానింటను
బొంగలి నదివెట్టఁ దినియెం బో యది యెగ్గా
గంగాధర యేమం టఁ దు
రంగపతే తురక కాక రంగప తౌనా.

తురంగపతి=అశ్వపతి- పాచ్ఛాకొక. రంగపతి=శ్రీరంగనాయకులు.

(40) "హారంబులు లేక యమను నాటనుదే కా."

క. ధీరతను దెంపుచేసుక
ఘోరాహవభూమిఁ గూలిన మేటా
శూరగణ మప్పు డమృతా
హారంబులు లేక యమను నాటనుదే కా.

హారములు=ఆహారములు లేకయే. అమనులు=చావనివారైరనుటవిమనుము. అమృ
తాహారములేకయే, యుద్ధమునం గీర్తిన గూలు లమరులై రని సమాధానము.

(41) "గాలికి సదృశములు యువతికి తిన కుచంబుల్."

క. వలఁగిసమములు కన్నులు
కాలాహికి సాటి వేణి కాముని విల్లా
భ్రూలత లన్నటుగను న
గాలికి సదృశములు యువతికి తినకుచంబుల్.

నగ + అలికి=నగాలికి, కొండలగుంపునకు.

(42) "ధీరుఁడు రణ మన్న వెఱచుఁ దెపరిగామిన్,"

క. సూరునిఁ గన్న దివాంధము
బైరినిఁ గనఁగొన్న కొంగ పంచాననముం

జేరినమృగ మన్నట్ల య
ధీరుఁడు రణమున్న వెఱమఁ దెంపరిగామిన్.

(43) "రాముని సతి గుణము శబ్దరాశిం గొలిపెన్."

క. భూమీశు నెదుట వారల
పై మంటను గుండ్లుచుం దుపాకిని నిడి తా
వేమఱు బాదను నుంచిన
రాముని సతిగుణము శబ్దరాశిం గొలిపెన్.

రాముని సతి యగుసీత గుణము శబ్దరాశిం గల్పించుట- విషమము.

రామునిసతి=జానకి; గుణము=త్రాడు. జానకిత్రాడు, పూర్వము కర్ణాటకపుతుపాకులకు జానకిత్రాళ్లచివర నగ్ని ముట్టించియుంచి, బావక, అనఁగాఁ దుపాకిమందు, పోసిన తుపాకి చెవికిఁ దగిలించిన నది శబ్దముచేసెడిది, ఆ చెట్టునార మొదలగు కొన్నినారలతోఁ ద్రాళ్లు పేని నిప్పంటించిన నది యారకుండ రగులును. రంజకమంటుకొనిన శబ్దించును. రామునిసతిగుణము=జానకిత్రాడని కల్పింపఁబడినది. లక్షితలక్షణముగా గ్రహించునది.

(44) "మీసానకుఁ గాళ్లు మూఁడు మేదినిఁ గల్గెన్."

క. మీసానకుఁ గాళ్లెక్కడ
వాసిగ విన్నదియు లేదు వసుధాస్థలిలో
వాసనగందము రాచెడు
మీసానకుఁ గాళ్లు మూఁడు మేదినిఁగల్గెన్.

మీసానకు=మీసమునకు- మీసానకు=మీఁగండపుసానకు-

(45) "పులి దాసరులకును బెట్టెఁ బొట్టలు నిండన్."

క. పులి యెదురఁ బడినచోఁ దిరు
మలరాయని వేఁడుకొనఁగ మనసున నొకఁడా
వలఁ దొలఁగిపోయె శాంతతఁ
బులి దాసరులకును బెట్టెఁ బొట్టలునిండన్.

పులి హింసచేయక తొలఁగిపోయినది. అతఁడు పిదప వేఁడుకోలుచొప్పున దాసరులకు భోజనము పెట్టెను.

(46) "వాలంబులు రెండు నిండుబంట్రౌతునకున్."

క. కేలను గేడెము వీఁపున
మేలౌ తరకసము బాకు పేటి న్వలచే

బాలాపుడుదలలోఁ గర
వాలంబులు రెండు నిండుబంప్రాతువకుఁగా.

(47) "విధవా నీ మగఁడు నిండువేకటి గదవే."

క. విధుశేఖరుసతి యాజ్ఞను
మధురాధర యైనఁ గూడె మారుని కేళిన్
బుధుఁ డేమి చెప్ప గృహావట
విధవా నీమగఁడు నిండువేకటి గదవే.

విధవా నీ మగఁడు=అనునది విషయము.

గృహావటవిధవా=గృహాత్=ఇల్లుగాఁజేసికొనిన, అటవి=అడవిగలవాఁడే,ధవా=పెనిమిటిగాఁగల యోవనితా=నీమగఁడు పరిపూర్ణగర్భమును దాల్చె నని సమాధానము.

వైవస్వతమనువు పుత్రుం బడయఁగోరి వసిష్ఠుం బ్రార్థించి యతనియాజ్ఞచే యాగ మొనరించిన, నతనిభార్య యిష్టముచొప్పున హోత ప్రయత్నము ద్వారా. కుమారి జనించెను. మఱియు వసిష్ఠునిప్రయత్నముచే నాకుమారి కుమారుఁడయ్యెను. ఆకుమారుఁ డొక నాఁడు వేఁటకువెడలి మేరుపర్వతాగ్రస్థ కుమారవనముఁ జేరఁగాఁ బూర్వమే యొక కారణమున శివునిశాప మావనమున కేర్పడినచొప్పున స్త్రీరూపము గలిగెను. తత్సమయమున బుధుఁడు, ఆస్త్రీని గూడిన నామెయు గర్భిణియై పురూరవునిం గనియె నని పురాణ ప్రసిద్ధము. పురుషరూపమున సుద్యుమ్నుఁ డనియు, స్త్రీరూపమున నిలాకన్యయనియుఁ బేరులంగాంచెను.

(48) "పగటఁ జంద్రికఁ గనుపించెఁ బద్మనయన."

సీ. బాగములు సేయుచును వేడ్కఁ బలుకులాడఁ
దమ్మ రసమింతకొకపైఁ దగిలియుండ
నేమి యనఁ గొంకి తెలుసుక యింతినవ్వ
పగటఁ జంద్రిక గనుపించెఁ బద్మనయన.

(49) "కుందేటికిఁ గొమ్ములాఱు కుక్కకువలెనే."

క. మందకడఁ దఱిమి పట్టిన
నందాల మూఁడు పసరమ్ములదరి పొడిచినన్
ముందుబడి వెనుక దూసెను
గుందేటికిఁ గొమ్ములాఱుఁ గుక్కకువలెనే.

మందలో నొకకుక్కయును గుండేలును జగడమాడఁగా నక్కడనున్న మూఁడు పసరములు బెదరి యారెంటిని దమకొమ్ములతోఁ బొడువఁగా మూఁడావుల యాఱు కొమ్ములును గుండేటికిని కుక్కకును గూడ గ్రుచ్చుకొనియెనని-

(50) "చేప కొంగను మ్రింగెను జెట్టుపైని."

గీ. బలునిడివి యైన దాసరిపా మొకండు
చెట్టుమీఁదను గొమ్మను జుట్టుకొండి
దెలియకను గూఁటిపిల్లలఁ గలయ ముక్కు
చేఁప కొంగను మ్రింగెను జెట్టుపైని.

కొంగ యొకచేఁపను దనముక్కుచేత నెత్తుకొని యొక్కవృక్షముమీఁదఁ గట్టియున్న గూఁటియందుఁ గలతనపిల్లలకు నిచ్చునపుడు ఆవృక్షముమీఁది కొమ్మనుజుట్టుకొనియున్నపా మాచేఁపను ముక్కునందుఁ బెట్టుకొనియున్న కొంగను మ్రింగెను.

ముక్కునందుఁ జేఁపగలకొంగ ముక్కుచేఁపకొంగ.

(51) "దీపముశిఖమీఁద నీఁగ స్థిరముగ నిలిచెన్."

క. శ్రీపతికి భక్తి ధూపము
దీపము లిచ్చె ఘనితాన ధీరుఁడు వ్రాసెన్
గోపురముమీఁద వెరుకన్
దీపము శిఖమీఁద నీఁగ స్థిరముగ నిలిచెన్.

గోపురముమీఁద వ్రాసిన దీపపుశిఖమీఁద నీఁగ వ్రాలెనని-

(52) "కుంతికిని నుంపడంబయ్యెఁ గులుకులాఁడి."

గీ. ఖడ్గితో నొక్కమాసంబు గలిసియుండెఁ
జక్రితోడను నట్లనె సరసుకొనియెఁ
బోటుకాఁడని మదినెంచి పూని యిపుడు
కుంతికిని నుంపడంబయ్యెఁ గులుకులాఁడి.

ఖడ్గముగలవాఁడు ఖడ్గి- చక్రముగలవాఁడు చక్రి. అట్లే కుంతము=(బల్లెము)ను చేతఁబట్టినవాఁడు కుంతి. ఆకుంతాయుధధారితోఁ గులుకులాఁడి యిపుడుండెననిభావము.

(53) "కడుపునఁ బెట్టుకొని ప్రోచెఁ గమలోద్భవుఁడున్."

క. మడుపులమీఁదను నాసలు
విడఁబడ వెవ్వారికైన విశ్రుతమా బు

దిరమై దిగులునఁ బదయం
చుటుకుఁ గదా పంద రణము చూచినవేళన్.

పదయంచుకా, ఉటుకుఁగదా=పాఱిపోవునుగదా.

(58) "కిన్నెర నటువెట్టి బాల కిలకిలనవ్వెన్."

క. పున్నమచంద్రుఁడు మెఱయం
దిన్నఁగఁ దెమ్మెఱలు విసర ధీరత దప్పం
జన్ను లని కాయలంటిన
కిన్నెర నటువెట్టి బాల కిలకిలనవ్వెన్.

అంటినవాఁడు విటుఁ డని తలఁపవలయును. భ్రాంతిమంతము, ఉన్మాదసంచారిభావము.

(59) "అయ్యయ్యో ప్రౌఢ ముగ్ధయై విలసిల్లెన్."

క. తియ్యని మోవిని గ్రోలఁగ
నయ్యెడ నేమియును దెలియ కతిమోహమున
న్నయ్యనున నేమితోఁపక
యయ్యయ్యో ప్రౌఢ ముగ్ధయై విలసిల్లెన్.

ఇచట, ప్రళయము నను సంచారిభావము.

(60) "నలుగురిమట్టునను నిలిచె నాయిల్లాలే."

క. కలఁవలదోర గంధర్వుఁడు
జ్వలనుఁడు నావెనుక నరుఁడు సరసీరుహనే
త్రలకుఁ బతులగుదు రౌఁగా
నలుగురిమట్టునను నిలిచె నాయిల్లాలే.

(61) "మామం దాత యని యొకనిపై సతి పడియెన్."

క. కామిని యొక్కటి వినవే
యామని స్వేదంబు నధికమై యపు డేపన్
ఏమని చెప్పుదు ననహా
మామం దాత యని యొకనిపై సతి పడియెన్.

(ద్రౌపది) మామను- భీమునితండ్రియగు వాయువును- తాతయని- వాయువు అగ్నికిఁ దండ్రి. తాను అగ్నిలోఁ బుట్టినదిగావునఁ దనకు వాయువు తాత. (స్పష్టముగా లేదు పద్యము.)

(62) "కంధులకును నెట్టిమట్టి కావలయును కా"

క. ముందుగ మాటలబిగువులు
నెందుకురా గాడె దీవు నేర్పడి నాతో
నందఱుఁ బోర్లరె మట్టిని
గంధులకును నెట్టిమట్టి కావలయును కా.

మల్లయుద్ధమందు సాదనకాఁడు మఱియొకనిం జూచి నీదిట్టతనము నాతోఁ జెల్లదు. ఎట్టిమట్టిలోఁ బొరలినవారి నెందఱినో చూచినాఁడను. కంధులంకూడ నెట్టిమట్టి పూసికొని యున్నవి. నీ వెంత నీసాదన యెంత యని తిరస్కారము.

(63) "రామునికోపము వసిష్ఠుల నొప్పించెన్"

క. సేమముగ విందు పెట్టిన
నామకానివ రేణ్యుగోవు నడిగిన నీమిన్
ఏమఱక యుద్ధభూమిని
రామునికోపము వసిష్ఠుల నొప్పించెన్.

రాముని=రాజమౌని. విశ్వామిత్రుఁడు, రాముని=విశ్వామిత్రుని కోపము; వసిష్ఠునకు బాధక మయ్యె ననుట. కాని రాముని=దశరథరామునియొక్క అని కాదు. యుద్ధభూమిని, రా=ర్థాఁగా మునికోపము అనియుం జెప్పవచ్చును.

(64) "కరపదవదనముల నొక్కకట్టియ దూసెన్"

క. సురతాణి లగ్గవెట్టఁగఁ
గఱకొ ములు నాటఁ బాటఁ గఱచుక తీయన్
పెటవాఁడు నేయ నప్పుడు
కరపదవదనముల నొక్కకట్టియ దూసెన్.

ముల్లు నాటికొనినందున నొక్కఁడు కాలిని జేతిలోఁ బట్టుకొని పంటితో వాముల్లూడఁదీసికొనుచుండ వేఱొకఁ డాతనిపై నంపకట్టియ వైవ ముల్లుతీసికొనువాని కరము, పదము, వదనము నీమూఁటియందు నొక్కబాణమే గుచ్చి చనినది.

(65) "పులినిబడె గుంపు వందియు నెలుఁగు నీల్గె."

గీ. పులికిఁ జూచుకంటఁ జెంతల మెలఁగువాని
పైఁబడక మాన దిది వినఁబడిన మాటె

మాటుమఱుఁగునఁ బొలకువ మీటమీటఁ
బులినిఁ బడె గుండు పందియు నెలుఁగు నీల్గె.

పులి, పంది, యెలుఁగును నీరుత్రాగుచుండఁగా వేటకాఁడు మాటుననుండి తుపాకి మీట మీటినాఁడు. గుండు పులిమీఁదఁ బడినది. అది కోపముచే దగ్గఱనున్న పందిని, ఎలుగును జంపి తాను జచ్చినది.

(66) "వీఁపునఁ జను లుండె గోళ్ల వెండ్రుక లుండెన్."

క. ఆపురుషుం డాపడఁతిని
వైపున సిగ వేయు మనుచు వచియించెను దా
రాపద్మాక్షికిఁ జంపురు
వీఁపునఁ జనులుండె గోళ్ల వెండ్రుక లుండెన్.

సిగ వేయుటకు వెనుక నున్న దానిస్తనము లాతనివీఁపున నున్నవి ఆమెగోళ్లలో వెండ్రుకలున్నవి.

(67) "రథమునును బండి తినుట చిత్రంబుగాదె"

గీ. సారసాక్షిరో నీమగఁ డూరలేఁడు
బహుదినాలుగ నదియు నీపట్ల వాసి
శంకరునివింటితునక శరచ్ఛవిని గనుట
రథమునను బండి తినుట చిత్రంబుగాదె.

ఒకస్త్రీ గర్భముదాల్చి బయ్యంకలగుణముచే మన్నుతినుచున్నది. ఆమె మగఁడూరలేఁడు. ఉండిన భయముచేఁ గొంకమానును, అని భావము. శంకరునికి భూమి రథము సూర్యచంద్రులు బండ్లు అని త్రిపురసంహారకాలపురాణకథ గలదు. రూపకాతిశయోక్తిగా రథమును అనఁగా భూమిని (మట్టిని) బండి=అనఁగాఁ జక్రమైన చంద్రుఁడు (ముఖము) తినె ననుట-

(68) "అశ్వినికి వెన్కలో నుండునది యొసంగె."

గీ. ఎచటనే యుండివచ్చె నీయెమ్మెకాఁడు ?
పుబ్బ కావలిదిక్కుకుఁ బోయివచ్చె.
నేమి కానుక యొసఁగెనే యింతి నీకు ?
నశ్వినికి వెన్కలోనుండునది యొసంగె.

పుబ్బ కావలిదిక్కు—ఉత్తరదిక్కు. అశ్వినికి వెన్కలోనుండునది=బరణి.

(69) "అల్లె ఖేటకమును గూడ నైనఫలము."

గీ. పతి యిచట లేనివేళ రేపకడయుండు
సర్పమణిఁ దెచ్చి తా నొమ్ముచక్కి నిడిన
సర్పణముసేతు గరుడ నీకధికభక్తి
నల్లెఖేటకమును గూడనైనఫలము.

నాథుఁడింటలేని యీసమయమున సర్పమణిన్=భుజంగరత్నమును (జారనాయకుని) దెచ్చి తాన్- ఱొమ్ముకడ నిడినయెడల, గరుడ=ఓవినాయక! (వి=పక్షులకు నాయక=ప్రభువా) నీకు అధికభక్తిన్ అల్లెఖేటకమునుగూడన్, అల్లె=నారి, ఖేటకము=కేడము (డాలు) నారి కేడము నను రెండుపదములుంగూడినప్పుడు అయిన ఫలమును అనఁగా నారికేడమును=టెంకాయను నీకర్పణచేయుదును. భుజంగులు=సర్పములు జారులు. ఖేటకశబ్దమునుండి కేడెమైనదని యందురు. ఖేట కేడ కావచ్చును. నారికేడము డళలకు భేదము మాన్చిన నారికేళము కాఁగలదని సమర్థింపఁదగును.

(70) "అన్నను సవతి యని పోరువల్లె యయ్యెన్."

క. వెన్నుఁడు మోహినిగా నా
చున్నయెడన్ శివుఁడు చూచి సొక్కుచుఁ దాఁబై
కొన్నఁ గని డెంద మోర్వక
యన్నను సవతి యని పోరువల్లె యయ్యెన్.

అన్నగారిని సవతి యని పోరుట యెందైనఁ గలదా, కలదు. విష్ణుదేవుఁడు పార్వతికి, అన్నవరుసవాఁడఁట. ఆవిష్ణువు మోహినివేషము వేసినపుడు శివుఁ డామోహినిని మోహింపఁగాఁ బార్వతి నాయన్నయే నాకు సవతి యయ్యె నని కలహించె నని చమత్కారము.

(71) "ఇనతనయునిఁ జూచి రాముఁ డిట్లని పలికెన్."

క. ఇనతనయుఁడు రామునిఁ గని
తనయన్నను నీవు గూల్చుదా రెట్లన్నన్
మును సాలమ్ములఁ గూలిచి
యినతనయునిఁ జూచి రాముఁ డిట్లని పలికెన్.

ఎట్లు నీవు వాలిని జంపెద వని సుగ్రీవుఁ డడిగిన ముందుగా నేడుసాలవృక్షములం గూల్చి, యినతనయునితో 'నిట్లు' అని రాముఁడు పలికె నని సమాధానము, అభినయరూపమునఁ జెప్పెననుట.

(72) "వజ్రము వెన్నక్కఁ గెంపువలెఁ గన్పించెన్"

క. వజ్రసమనాస వినుమీ
వజ్రీఁడు మదాంధరిపుల మాన్యుని పొడువన్
వజ్రముపో ల్జముదాడిని
వజ్రము వెన్నక్కఁ గెంపువలెఁ గన్పించెన్.

ఒకకూయఁడు =శత్రువులను జముదాడిచేఁ పొడుచునపు డది చూసి వెన్కుకఁజన వారిమొదళ్లనుండి నెత్తురు కారెను. అనెత్తురుపూసిగొని యాజముదాడి వజ్రము కెంపు వలె నెత్తుఁగ గనుపట్టెను. అని సమాధానము. జముదాడి వజ్రము=చిన్న, కొన.

(కఠినప్రాసశబ్దచిత్రాక్షరయతివంచనా సమస్య.)

(73) "గ్లావిమలాక్ష వేంకటనగాధ్యక్షా"

క. దిగ్గలనాకబకీధర
స్రగ్గాలితకీర్తిజాల సద్గుణశీలా
విగ్గిశరక్షమాక్షా
దగ్గ విమలాక్ష వేంకటనగాధ్యక్షా.

(74) "విధ్యండము లీక్షకీతి విస్రుతమయ్యెన్."

క. అధ్యాత్మవిద్య యుపనిష
దధ్యయనముఁ జేయుఁ జేతు నద్దముఁ బయలై
సాధ్యం బైనను దలఁచిన
విధ్యండము లీక్షకీతి విస్రుత మయ్యెన్.

విధ్యండము=బ్రహ్మాండము లీక్షకీతి=ఈగువలె పై. ఈగువఁగాఁ జేమద్దై.

అధ్యాత్మవిద్యాభ్యాసముచేసి-వారికి బ్రహ్మాండము, ఈగువలె సూక్ష్మముగా గనపడు నని భావము.

కఠినప్రాస పునరుక్తయతిమనుసమస్య.

(75) "గోగ్రణిగో అగ్రణీగవాగ్రణి యనియెన్."

క. అగ్రజ గోశబ్దముపై
నగ్రణిశబ్దంబు గూడ నదియె ట్లగునా
ధిగ్రహణముఁ దెలుపు మనన్
గోగ్రణి గోఅగ్రణీ గవాగ్రణి యనియెన్.

(76) "గోఅగ్రణి నెక్కి శివుఁడు గొబ్బున వెడలెన్.

క. భో అచ్యుత భో బ్రహ్మన్
భో అం[illegible]కారినాంవిభో సర్వదే
వా ఆ[illegible]వ్యా యన
గోఅగ్రణి నెక్కి శివుఁడు గొబ్బున వెడలెన్.

(77) బాహ్లీకహాయమెక్కి రాజు ఫౌఁజుకు వెడలెన్."

క. ప్రహ్లాదవరదుఁ గొల్వఁగ
నాహ్లాదము మానసంబునందు జనింపన్
బాహ్లీకరసవర్ణం బగు
బాహ్లీకహాయ మెక్కి రాజు ఫౌఁజుకు వెడలెన్.

(78) "కల్హారమరందమట్లు కల్లికిఁ బల్లుల్"

క. బల్హాయి తోఁచునట్టి రొయి
డల్హాయులై నట్టి విల్లడల్ గనుఁగొన్నన్
మేల్హాదంటి నిఖాబురె
కల్హారమరంద మట్లు కల్లికిఁ బల్లుల్.

(79) "చందురులోఁ గందు మిగుల సమ్మదవృత్తిన్"

క. ఎందుకుఁ బలుమాటలు విూ
కిందఱకును భ్రాంతియేల యీయింతిముఖం
బందము వేతే లే యల
చందురులోఁ గందు మిగుల సమ్మదవృత్తిన్.

*ఇది ఆగోపనసమస్య. ఈయింతిముఖలక్షణము చంద్రునియందు కందుర్=చూచె ద్దను కమఁగొందును అని భావము, కాని చంద్రునిలో. కందు=కళంకము అని కాదు.

(80) "దొన పులి మొన యమ్ము శాఖ తుద లని పలికెన్"

క. వనజాంబకుండు ననుఁగని
కినుకం గనలుచును గనులఁ గెంపు జనింపన్

ననతూపు లేసి రమ్మను
దొనపులి మొనయమ్ముశాఖితుదలనిపలికెన్.

ఇది-అంతర్లాపిసమస్య-దొన, పులి, మొన, అమ్ము, శాఖి, ఈశబ్దములతుదలు, అంత్యాక్షరములు, నలినముఖి అనియగును. ఒక స్త్రీ తన చెలికత్తెను జూచి దానితో ఓనలిన ముఖి నన్ను మన్మథుండు రమ్మను నని పలికె నని భావము.

(81) "నారదవంద్య కాంతిజితనారద కౌఁగిలి నీయవేమిరా"

క. మదనుఁడు కోపముచేతం
గదనంబును జేయఁ దొడఁగెఁ గ్రక్కునవో నా
రద వంద్య కాంతిజితనా
రద కౌఁగిలి నీయవేమిరా యిదినేరా.

ఇది వృత్తగోపనము—ఉత్పలమాలవృత్తమువలె సమస్య కానిపించును, గాని, కందపద్యములో నిమిడిపోయినది.

(82) "కలిమిబలిమి ఫలముచలము కళుకుకులుకు కేవియావి కలిగి మెలఁగి నీవలరుమిరా."

క. కలిమి బలిమి ఫలముచలము
కళుకు కులుకు కేవి యావి గలిగి మెలఁగి సి
వలరు మీకుఁ బలుమఱును గలు
ములను గల కలికి ప్రతిదినము కరుణ సేతుర్.

ఇది వృత్తగోపనగతిభేదసమస్య.

(83) "అనఘులు హరిహరు లనయము దయచే మనుపఁ జెలువు గులుకును జగతిన్."

క. వనజాస్య వింటివా తెలి
యను నాయనఘులు హరిహరు లనయము దయచే
మనుపఁ జెలువు గులుకును జగ
తిని నాచెలువకును సాటి తెఱవలు గలరే.

ఇదియును వృత్తగోపనసమస్యయే. "అనఘులు హరిహరులనయముదయచే" నని మణిగణనికరముగా దోఁచును. కాని కందపద్యమే. అనఘులు హరిహరు లనయము దయచే

కొని మనుపఁ జెలువు గులుకును జగతిన్ అని మూలములో మణిగణనికరము రెండు చరణము లీఁబడినవి. కందపద్యములో కొని యను రెండక్షరములు తీసివైచినఁగాని సరిపోదు.

(84) "కలికీ ననుఁజూచి విడెము గైకొను మింకన్"

క. వలరాజు చేతికోలఁదిని
జలమున నాపైని బాణజాలము వేసెం
గలమాట చెప్పి తివ్వెడె
కలికీ ననుఁజూచి విడెము గైకొను మింకన్.

(85) "బావిని బట్టములు దానిపైకడఁ గొండల్"

క. దేసర పరాకు విను మిది
గో విద్యను నైంద్రజాలికుఁడు నేనని మా
యావిలసనమునఁ జూపెద
బావిని బట్టములు దానిపైకడఁ గొండల్.

(86) "ముక్కులు నాలుకలు మూఁడు పొలఁతికిఁ గంటిన్"

క. అక్కట యిదేమొ తెలియను
నిక్కముపలెఁ దోఁచెఁ గలను నిన్నఁటి రేయిం
జెక్కులు పదాఱు నేనిమిది
ముక్కులు నాలుకలు మూఁడుపొలఁతికిఁగంటిన్.

(87) "విధవా నీమగఁడు నిండువేకటి గదవే"

క. విధురథసంబుద్ధి త్వదీ యధవుఁడుఁ పూర్ణమగుగర్భ మన్వాభిధచే
మధురాక్షి తెలుపుమంటివి విధవా నీమగఁడు నిండువేకటి గదవే.

విధురథసంబుద్ధి=విధవా (వి=పక్షి, ధవ=ప్రభువు) గరుడ! త్వదీయధవుఁడు=నీమగఁడు. పూర్ణగర్భము=నిండువేకటి-అని క్రమాలంకారము-అన్వాభిధచే=మాఱుపేరులతో వచ్చినది. విధురథుఁ డనఁగా విష్ణురథుఁడు, గరుడుఁడు, గరుఁడునిసంబుద్ధి, విధవా! మధురాక్షి!

(88) "చేతోజాతదవానలంబుడుపవే నీమాటి యీమాటికిన్
స్రోతస్స్యంధుల నంబుయంత్రనతికృతోప్రోద్గీతగేయాఘముల్
జ్ఞాతిశ్చే దనలేన కిమ్మనెడి వాచాయూథి సత్యమ్ముగన్."

శా. జ్ఞాతి శ్చేద్ది లేనకిమ్మనెడి వాచాయాథి సత్యమ్ముగం
జ్ఞాతాజ్ఞానలం బుడుపవే సీమాటియీమాటికిన్
... నంబు యంత్రనతిక్రుశ్రోప్రిద్దీతగేయకాఘముల్
... దప్పెను మబ్బుగమ్మె వెతలన్ శ్రీపుత్రు నన్ ద్రోయకే.

బ్రహ్మ సరస్వతిని బ్రార్థించెననుట. బ్రహ్మకు మన్మథుఁడు జ్ఞాతి యని-

(89) "చిటికెన వ్రేలియుంగరము చేడియ కొడ్డనమాయె భూవరా
కటకచరత్త్రరేణుకరకంపితసాలము శీతశైలముం
గటకట దోసపం డినుపకట్లకుఁ దాళునె తలోదరీ."

చ. చిటికెన వ్రేలియుంగరము చేడియ కొడ్డనమాయె భూవరా
కటకట దోసపం డినుపకట్లకుఁ దాళునఁటే తలోదరీ
కటకచరత్త్రరేణుకరకంపితసాలము శీతశైలమున్
ఘుటితిని గాంతు నేనని నిశాంగనతోడను దెల్పు వేగమే.

పార్వతి తనపుట్టినయింటిలో (హిమత్పర్వతమున)నుండి చెలికత్తెతో నాయకునికి వార్తయంపినది. ఆచెలి శంకరుం గని, భూవరా! పార్వతీదేవికిఁ జిటికెన వ్రేలియుంగరము ఒడ్డాణమాయె నని తన కార్శ్యముం దెలియఁజేయ, శివుఁడు, అనుశయమునొంది, తలోదరీ దోసపండు, ఇనుపకట్లకుఁ దాళునా, అనఁగాఁ, బార్వతి విరహవేదనను సహించునా యతిశీఘ్రముగా వచ్చుచున్నాఁడనని చెప్పుమనియె నని భావము.

క. ఈకృతి యతికఠిన సమ స్యాకృతిఁ జదివినను విన్న నఖిలార్థము లా
నేకృతికైన శీఘ్రమె శ్రీకృతి విజ్ఞాతరయము బృహదంబకతన్.

గద్యము. ఇది శ్రీబృహదంబికా పాదారవిందనిరంతరసంసేవనావిశేషలబ్ధ మహాసామ్రాజ్య ధురంధర, సకలభూపాల సభాభాసుర యశోబంధుర, హనుమద్గరుడ మకరమత్స్య పతాకాది మహారాజలక్షణ నవవిధాంగ భేరీప్రముఖ నిఖిలవాద్యగంభీర నినాదశ్రవణమాత్రవిరోధి గర్భ నిర్భేదన విచక్షణ, పాండ్యభూపాల దక్షిణ బాహాయమాన సకలభూపాల సంస్తూయమాన, వాత్స్యాయన ప్రభృతి శ్రుత్యంత పర్యంతక కోవిద సముత్తేజిత ప్రతిభా విశేష ప్రబంధ శతసమానవచోనిర్మితాదిశేష, అకురచనీయ మధురాది కవితాధారేయ, కవిజనవిధేయ, రణరంగవిజయ రఘునాథ విజయరఘునాథ తొండమాన్ మహీనాథ తనూజ, రసికతాభినవభోజ కోటికులదీప శ్రీరాయరఘునాథ భూపప్రణీతంబైన కవిజనోజ్జీవనియను కావ్యంబునందు సర్వంబు నేకాశ్వాసము.